# అగ్గిరాముడు

## రామత్రయము

గ్రంథకర్త:

చింతా శంకరదీక్షితులు



ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమంద్రి

1946

రాజమహేంద్రవరము :
శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె.

ఇ. జి. 14—1000—1946



# అగ్గిరాముడు

"దాసూ! ఏమి ముంగిమునలమ్మవలె గూర్చుండినావు?"

పడకకుర్చీలో గూర్చుండి విశ్వనాధము నారాయణదాసు మనో
ారమును గనిపెట్టెను.

"ఏమిచేయుమనెదవు? మూడుప్రొద్దులును మనమేమిటో! విశాఖపట్టణపు సముద్రపుగాలియేమిటో! అందులో నీమధ్య నెక్క
కీగినను, నీయంతట నీవే పోవుచుంటివికదా? నాకీ యూరనుండినచో
మియు దోచుటలేదు."

"ఎక్కడెక్కడనుండియో వచ్చి యీయూరిగాలికై నెలలకు
లిక్కడ నెల్లయును మకాము చేయుచుండగా నీకు గష్టముగానున్నదా?
రగా తినగా వెగటైనదట! నాకుమాత్రము మీయూరు విడచుట యనిన
ంతో విచారముగానుండును?

"విశ్వనాధం! దాదాపు ముప్పదియేండ్లు దాటుచున్నవికదా?
ంతవఱకు దేశ మేమిచూచినట్లు? పట్టుమని విశాఖపట్నముజిల్లా
నను నాలుగుమూలల జూడలేదుకదా? నీకేమిలే తిరుగుచుందువు.
చ్చుచుందువు పోవుచుందువు?"

"అట్లయిన నేమనెదవో చెప్పుము. ఈదినముననే బయలుదేరి
వుదము; ఎక్కడికో నిర్ణయింపుము. రాత్రికి రైలెక్కుదము. ఇటు
హంపురంవైపు పోవలయునని యున్నదా? లేక గోదావరీకృష్ణాలవైపు
దలంచితివా?"

విశ్వనాథం ! ఖరారేనా ? ఇదిగో నేను తయారే! రాత్రిదాక కూడ నెందులకు ? గోదావరీ కృష్ణాలవైపు పోవుదము. ఒక నెలైనను తిరుగకపోయిన నేను మనిషినికాను; ఖరారేనా ?”

“సరే! మూటాముడికి తయారుచేయుము. రాత్రి బయలు దేరుము. గోదావరిజిల్లాలో నెవరో యగ్గిరాముడున్నాడట ! వాని పోలీసువారు చేతులెత్తి నమస్కరింతురట ! వానిదర్శనము కూడ పోవుదము.”

“అదిగో మరల వానిదర్శనము వీనిదర్శనమని యచ్చట [illegible] పదిదినములు నిచ్చట నొక పదిదినములు నాగవలయుననిన నీప్రయాణ మెందులకు ?”

“దాసూ ! వాడు మనకగుపడియేడిచినాడా యేమి ? అప్ప మాట నాలోచింపవచ్చును.. ముందీతగవులా టెందులకు ? నీవుపోయి సామాను తయారుచేయుము !

దాసులేచి యింటిలోనికేగెను. అప్పుడే టీ త్రాగి కాలకృత్యములను దీర్చికొని యిర్వురు నీరీతి సంభాషించికొనిరి. ఉదయము తొమ్మిది గంటలాయెను. దాసింటిలోనికేగినతర్వాత నేదియో గ్రంథము దానిని గైకొని విశ్వనాథము చదువుకొననారంభించెను. ఇంతలో యరుగుమీద నడుగులయలికిడి వినబడెను. విశ్వనాథము గ్రంథమును జదువుటమాని వీధిగుమ్మమువైపు జూచెను. విశాఖపట్టణమునకు క్రొత్తగా నారునెలలక్రిందట బదిలీకాబడిన పోలీసు సబినిస్పె[illegible]ండల రావాతని కంటబడెను. ఆతడును తన బైసికిలును, వీధియరుగుపై బెట్టి లోనికరుదెంచి విశ్వనాథమునకు నమస్కారము [illegible] యొక [illegible] కూర్చుండెను.

"ఏమండోయి! కొండలరావుగారు! మహాత్ములూరకేరారు. మరల నేమైన నాకొంపమీదికి తెచ్చిరాయేమి? ఆనడుమ పచ్చును గనుగొనునప్పటికి నాతాసాలదరినవి."

"విశ్వనాథముగారన్న సామాన్యులా? ఈసారి నావ్యవహార మేమియు లేదు కొంచెము వేఱువిషయము మాటలాడవలయునని వచ్చినాను."

"మీపనియైనవెంటనే తిరిగి మాముఖమైన జూడరుకదా? ఏమండీ! అనిన పనితొందర యనెదరు ఉద్యోగముతీరనికొంత, ఆరు నెలలమధ్య తమ దర్శనము తిరిగిలేదు. ఈనాడు నెత్తిపై కేదియో తిరిగితెచ్చుటకే యీదర్శనము."

కొండలరావు కొంచెము చిన్నపుచ్చుకొనెను. విశ్వనాథమది గ్రహించి "కొండలరావుగారు! కోపమువలదు. ఇవన్నియు వేళాకోళపుమాటలే. మఱిమీరరుదెంచిన పని నెఱిగింపుడు, ఈరాత్రి బయలుదేరి, గోదావరి కృష్ణాలవైపు పోవలయునని నేనును దానును, నిశ్చయించుకొనినాము. అవసరమైనచో మీపని చూచియే పోయెదను"—అనెను.

"నాపనిపై గాదని చెప్పితినిగదా? మీరు పోదలంచిన దిక్కుననే ఆపని. కాకినాడలో సబిన్స్పెక్టరు సుబ్బారావుగారి నెఱుగుదురా?"

"అయ్యో! మూడేండ్లు దాదాపుకలసి చదివికొంటిమి. ఇప్పుడాయన యుండునది కాకినాడలోనా?"

"ఔను. ఆయనకేదో గట్టిచిక్కు వచ్చినది. ఏదోవ్యవహారమున దొందరకలిగినది. నాపేర వ్రాయగా నేను మీ రిచ్చుటనేయున్నారని వ్రాసితిని. ఇదిగో తిరిగి యుత్తరము వ్రాసినారు. మాతో

మాట్లాడుమని వ్రాసినారు" అని కొండలరావు తన జేబులోనుండి యొక కవరుత్తరము దీసి విశ్వనాథమున కొసగెను. విశ్వనాథ మా యుత్తర మిట్లు చదువనారంభించెను.

డిసెంబరు 8—1900

కాకినాడ

ప్రియమిత్రుని కొండలరావును దీవించి, సుబ్బారావు వ్రాయునది. నీవు వ్రాసిన యుత్తరమందినది. నాచిన్ననాటి స్నేహితుడు విశ్వనాథ మచ్చటనే యున్నాడని విని సంతోషించితిని. ఆతడీ విషయములో నాకెక్కువ సహాయము చేయగల్గునని నాగట్టినమ్మకము, వెనుక నీ కాతడుచేసిన సహాయమే నాయభిప్రాయమును బలపఱచుచున్నది. కనుక నీకీయుత్తర మందినతక్షణమే, వానియొద్దకు బోయి వాని సహాయమును నేను యాచించినానని, నాబదులుగ వేడికొని యీక్రింది సంగతులనెల్ల వాని కెఱుగజెప్పి, వాని సహాయమును సమకూర్ప వలసినది.

ఈచుట్టుప్రక్కల నీమధ్యరోడ్లపై దొంగతనము లెక్కువగా నున్నవి. ఎవరో ముగ్గురు దొంగలు పోగుపడి కొందరు దొంగలను గుమిగాజేర్చి, యీ చుట్టుప్రక్కల. మహాకల్లోలము జేయుచున్నారు. వారలలో ముఖ్యుడు అగ్గిరాముడు, మిగిలిన యిర్వురును దొంగరాముడు, బలేరాముడునని పిల్వబడుదురు. ఈరామత్రయ మీ జిల్లానెల్లను గగ్గోలుపెట్టుచున్నది. ఎన్నిసారులు వారిని పట్టుకొనుటకు పోలీసుప్రయత్నించినను, వారు దొరకలేదు. పైపెచ్చు వారలచే పోలీసు చాలాసారులు మోసము నొందినారు ఈ చుట్టుప్రక్కలవారీ భయముచే ప్రయాణముచేయుటకూడ మానినారు. ఈయగ్గిరాము [illegible] బలగమును గలవాడు, వానిని పట్టుకొనుట చాల కష్టము, వానిని [illegible] పట్టుకొనలేకపోయిన మొదల నన్ను

వన్స్పెండు చేసెదనని సూపరింటెండెంటు బెదరించుచున్నాడు. నేనింకొక పదిహేనుదినము లెక్కవగడువు కోరినాను, అతడియ్యకొననే కాని, నేటికిరువదియైదుదినములైనను, నేను వానిని పట్టుకొనలేక పోయినాను. ప్రాణము భీతిజెందుచున్నది. నిష్కారణముగా సుద్యోగము మ త్తరపుకావలసినదేమో తెలియదు ఇంక నిరువదిదినము లున్న కాని, వారలనుపట్టుకొనగలనని, నాకేవిధమైన నమ్మకమును లేదు. విశ్వనాధముగారు నన్ను రక్షించి వాతిండి నిలిపెదరేమో వేడుకొనుచున్నాను. అతిజరుగురు ఎట్లైనను, వారిసహాయమును యాచించుచున్న. నన్ను బాగుచేయుభారమువారిది. అతి జరుగురు. తత్క్షణమే వారి సమాధానమును వ్రాయవలయును.

ఇట్లు నీప్రియమిత్రుడు,

ఆర్. సు బ్బా రా వు.

విశ్వనాధమాయుత్తరమును తిరిగి కవరులోనుంచి, కొండల రావున కొసంగెను.

"అయ్యా! నేను సిద్ధముగానే యున్నాను. ఎట్లైనను నేటి రాత్రి ప్రయాణమనుకొనినదే! కాకినాడలో నీవ్యవహారమును జూచి, తిరిగి బయలుదేరెదను; మీరువ్రాయుడు. నేనునువ్రాసెదను; పాప మాతడు చాలచిక్కులలోనున్నాడు. నాసాధ్యమైనంత సహాయము చేసెదను"

వీధిలో "విశ్వనాధముగారు!" అని యెవరోకేకవైచిరి. విశ్వనాధ మామనుజుని లోనికిరమ్మనెను. ఆతడు టెలిగ్రాము బంట్రోతు. ఆతడు విశ్వనాధముచేతి కొకటెలిగ్రాము నీయగా నాతడు దానిని విప్పి యిటుచదివెను.

"రాత్రి దొంగతనము అంతాఅల్లరిగానున్నది. తప్పకరావలెను; మీామీద నాయాశ పెట్టుకొనియున్నాను—సుబ్బారావు"

అప్పటికి పదిగంటలాయెను. విశ్వనాథములేచెను.

"కొండలరావుగారు! నేను రాత్రికివచ్చుచుంటినని మరల తంతినంపుడు; నేనుభోజనమునకు బోయెదను"

కొండలరావు శెలవుగైకొని చనెను. విశ్వనాథమువలన నీయంశములనెల్లవిని, దాను కాకినాడమకామున కుత్సాహముతో నియ్యకొనెను.

# 2

"సుబ్బారావుగారు! బహుకాలదర్శనము. ఇప్పటికి చాలా కాలమైనది, మనముకలసి చదివికొని; కొలదికాలముక్రిందట నొకసారి రైలులో గనబడుటయేకాని, మరలగనబడలేదు. ఈయూరనున్నారని మొన్న కొండలరావుగారు తెలుపగా కాబోలునను కొంటిని!"

"విశ్వనాథముగారు! నాసంగతిమీాకు తెలియకపోయినను మీాసంగతిమాత్రమప్పుడప్పుడు పత్రికలలో చూచుచుండెడివాడను మీారు చేయుపరిశోధనావ్యాపార మప్పుడప్పుడు పత్రికలలో చదివి నాచిన్ననాటిసహాపాఠివిషయమై యానందించుచుండినవాడను."

"ఏమిటో మీాదయా, ఉద్యోగము గిద్యోగములేకుగ పిత్రార్జిత మింటగూర్చుండి గుణించుచున్నాను. ఊరకేయుండ యీావ్యాపారమొకటి తగిలించుకొనినాను"

"అందువలననే మాబోంట్లకిప్పుడైనను సహాయమొనర్చునవకాశమున్నది. కొండలరావుగారికి వ్రాసిన యుత్తరమును

చూచితిగిక దా, నాహృదయము చాల కలతనొంది యున్నది. విశ్వ
నాథముగారూ !'

"మీ యనుగ్రహముండిన నీకార్యమును ద్వరలోనే ముగిం
పగలనని నానమ్మకము. సంగతిసందర్భముల నుదయముననే మా
ట్లాడుకొనెదము. దాసూ! సామానును దీసికొనిరమ్మను. అయ్యా!
వీథిగది ఖాళీచేయించితిరా !"

"మీాతంతి చేరినది. ఖాళీచేయించితిని."

దాను సామానును దింపించినతరువాత, సుబ్బారావు శెలవుదీసి
గొని, యింటిలోనికి బోయెను. విశ్వనాథమును, దాసును క్రమ
ముగా నిద్రబోయిరి.

మరునాటి యుదయముననే, విశ్వనాథము నిద్రమేల్కొని,
దాసును నిద్రలేపి కాలకృత్యములను దీర్చుకొని, వీథిగదిలో గూర్చుం
డెను. కొలదికాలములో సుబ్బారావుకూడ వారికొఱకై కాఫీ, ఫల
హారమును తీసికొని, యింటిలోనుండి వీథిగదిలోనికివచ్చెను. ఫలహారా
నంతరము వారికి క్రింది సంభాషణ జరిగెను.

"అయ్యా! ఈ యగ్గిరాముని మకామెక్కడ?"

"వాడు తఱచు పెద్దాపురముతాలూకాలో నుండును. ఒక
గ్రామమని వారికి స్థిరములేదు. నేడిచ్చటనుండిన రేపు రాజమండ్రి
యందుండును. ఆమరునాడు తిరిగి కోరంగిలోనుండును."

"ఏకులస్థుడు? వానిపూర్వవృత్తి తెలియునా?"

వాడు మాలవాడు, ఏవృత్తియు లేదు; దొంగతనమున వాని
దోలినవాడు "నభూతోనభవిష్యతి" వాని కావిుగిలిన యిద్దరును
రెండుభుజములవలె నున్నారు."

వాని నంగతు లింకను గొంచెమెఱింగింపుడు, చాల చిత్ర
మైన ...నుజునివలె నున్నాడు.

“దొంగతనములో నారితేరినాడు. లక్షజనములో నున్నను నిర్లక్ష్యమే. కాని యాడువారిజోలికి మాత్రము బోవడు. చిన్నవారి నేమియు జేయడు. మర్యాదగా నున్న దిచ్చినచో, వారలను గొంత దూరము కూడ సాగనంపునట, మరి పెంకెతనము జేసినచో, హాత మార్చునట, వానిని పోలీసువారెన్ని పర్యాయములు పట్టుకొనెదమన్నను; వాడు వీలుచేసికొని వారిని నాలుగు తన్ని పారిపోవుటయో లేక మరల కనబడకుండ పారిపోవుటయో జరుగుచున్నది. వాని యొద్ద నెల్లప్పుడును పిస్తోలును కత్తియు నుండును. అగ్గిరాముడనిన జిల్లాజిల్లా పేరు మ్రోగినది. కాని యెవ్వరును దగ్గరకుబోయి వానిని పట్టుకొనలేకున్నారు.”

“మనుష్యు డేమాత్రపువాడండీ, పేరు మహానమ్మకముగా నున్నది?”

“అతడు చాలపొట్టివాడు, ఐదడుగుల పొడుగుండునేమో! కాని చాలబలము గలవాడని విన్నాను. ఒకపది పదిహేనుగురు మనుష్యులైనను వానిని బట్టుకొనలేరట!”

“వీనితో నుండువారెవ్వరు?”

“దొంగరాముడు బలేరాముడు ననువారిద్దరు వీని సేనానాయకులు, ఒక పెద్దగుంపునకు గుంపుండెడిది, కాని నేటికాగుంపు చెల్లాచెదరైపోయినది. ఈ మువ్వురును మాత్రము విడిపోలేదు. ఆ యిద్దరు నిరుపమానులు; అందులో దొంగరాముడు సుమా రారడుగుల పైనుండును; వానికి డొంకలును దడులు నడ్డుకానేరవు; విశేషము దేహదార్ఢ్యము కలవాడుకాదు కాని, చాలజిత్తులమారియని యందురు. చాలదివ్యమైన రూపమనియందురు. బలేరాముడు సుమారైదడుగులు తొమ్మిదంగుళముల పొడగుండును. [illegible] కాని

నలువు, తిరిగినమీసములు, పెచ్చుపెరిగినజుట్టు, కోలమొగము తిరిగిన దండలు, వా డగ్గిరామునితో తులయగు చేయియుందురు."

"వీరిలో నెవ్వరినైన మీరెన్నడైన చూచినారా?"

"సేనానాయకు లొకటిరెండు పర్యాయములు కనబడిరి కాని, చేతజిక్కకుండ దాటిపోయినారు."

"అగ్గిరాము డెప్పుడైన మీకు దర్శనమిచ్చినాడా? వా డెట్లుండును? వీరిర్వురిమో స్తరేనా యేమి?"

"వానిని నేనెప్పుడును జూడలేదు. ఇరువదిదినములనుండి వెదుకు చుండగా, నాకు వానిదర్శనమైన లభించినదికాదు. ఒకరోజున మండపేట సమీపమున నాపని చూచెడివాడేకాని, యేకారణముననో విడిచి పోయినాడు. ఎవరో కనిష్ఠేబు లొకటిరెండు పర్యాయములు వానిని చూచినారట; వారాతనినిట్లు వర్ణించియున్నారు. చామనచాయగల దేహము, గుండ్రనిమొగము, వాడైనమీసములు, నుంగరములజుట్టు, కొంచెము పెద్దనేత్రములును గలవాడట. ఆతని హ స్తమునందు సర్వదా చేతికి సరిపడిన చే బాడిదకర్రయుండునట. అదియే వాని వజ్రాయుధము! మొలనెప్పుడును పిస్తోలును క త్తియు నుండునట! సాధువులన్న పరమ భ క్తియుట విన్నాగా?"

"ఆహా! ఆమాత్ర మున్నదికదా! ఫరవాలేదు. సుబ్బారావు ... ! వాడు తఱచుగా నేరోడ్లపై నుండును? వాని దొంగతనములు సాధారణముగా నేరోడ్లపై జరుగుచుండును?"

"వానికొకరోడ్డనిలేదు. రోడ్లన్నియు వాని యధీనములోనివే యైనను వానికి ద్వారపూడి, మండపేట, రామచంద్రపురము రోడ్లన్న నెక్కు యభిమానమని యందురు"

"ఈమధ్య నేదో దొంగతనము జరిగినదని తంతినంపిరే యెచ్చట ? ఏమాత్రము పోయినదండీ ?"

"తన్నుత మఱెవ్వరినిగాదు—పోలీసువారినే! రామచంద్రపురమునుండి ఎనమండుగురు పోలీసుజవానులును, ఇద్దఱు హేడ్డులును, రెండువేల దస్తుదీసికొని ద్వారపూడి వచ్చుచుండగా మండపేట దాటినతర్వాత నానుగ్గురు నింకొక కొందఱును హఠాత్తుగా వారలపై బడి దస్తుపెట్టెలను మోసికొనిపోయిరట; వాండ్రారుగు రేమోవచ్చితి రట; తఱుమగా నంతబరువుతోకూడ వాండ్రు పారిపోయిరట. కాని, అందులో మువ్వురుమాత్రము దొరికిరి. సగము సొమ్ముకూడ దొరికినది. మిగిలినమువ్వురును వెంటబడుటకైన నవకాశములేకుండ పారిపోయినారు. ఆ మువ్వురే యీరామత్రయము. వాండ్రు పరుగారంభించి తిరిగి కనబడకుండ డొంకలుడొంకలు దాటుదురు. సూపరింటెండెంటు చాలకోపము గనబఱచుచున్నాడు. పాపమమాయకుడు న్యాయముగా నేమియు జేయలేదు. అట్టివానికే కోపమెక్కుడైన. రవ్వారట్టు నాపై బడినది. ఇరువదిదినములనుండి తిఱుగుచున్నాను. ఇంతవఱకు మనుష్యుడైనను కనబడలేదు."

"చెట్టు కాకమునుపే వంచవలయును. లేకున్న మనతరముకాదు. వానిని పెరుగనిచ్చితిరి. నేడు వానిని పట్టుకొనుట శక్యముకాకుండ నున్నది. సూపరింటెండెంటు కోపమువకేమిలెండు; ఏమియు జేయలేని వానికే గురగుర శాస్త్రీ సుబ్బారావుగారు! నాశక్తి యున్నంతవఱకును, నేను ప్రయత్నించెదను. పైన మీయదృష్టము నేడే బయలుదేరి ద్వారపూడివైపేగి వచ్చెదను. మాదాసిచ్చటనే యుండును" అని [illegible]వు తిరిగి "ఏమోయిదాసూ! నీవు వెంటనుండిన వానిని [illegible]నుట నాకు శక్యముకాదు. నీవు సుబ్బారావుగారింట నుండుము. [illegible]మైనచో కబురంపెదను" అని పలికెను.

దాను తల పంకించెను. విశ్వనాథము సుబ్బారావును దూర ముగా దీసికొనిపోయి రహస్యముగా కొంతకాలము మాట్లాడెను. సుబ్బారావు మొదట సందేహించెను. కాని, విశ్వనాథమునకు గోపము రాగలదని కాబోలు నేదోవిధముగ నేర్పాటు జేసెదనని చెప్పి యొప్పిం చెను. విశ్వనాథము తిరిగి గదిలోనికేగి కొంతకాలమునకు భోజనము నకు లేచెను.

భోజనమైన తర్వాత విశ్వనాథము కాలినడకను బయలుదేరి రెండుగంటలకు చామర్లకోట రోడ్డున కళింగలిప్రక్కగా బయలుదేరి పోయెను. కాకినాడకు చామర్లకోట సుమారేడుమైళ్ళుండును. వడిగా నడువగల్గుటచే నాతడు మూడున్నరగంటలకే చామర్లకోట జేరి బసివిరెడ్డిగారి సత్రమునకేగి వీధియరుగుపై గూర్చుండెను.

## 3

రైలుస్టేషనునకు సుమారు నూరుగజములదూరములో నీ బసివి రెడ్డిగారి సత్రమున్నది. ఆకాలమున బ్రాహ్మణులకుగూడ నీ సత్రమున విరివిగా నన్నప్రదానము జరుగుచుండెడిది. విశ్వనాథమా రాత్రికచ్చ టనే యుండనిశ్చయించుకొని యరుగుమీద గూర్చుండెను. కొంత కాలమేగినతర్వాత నెవ్వరో, వారును వీరును వచ్చి ఆ యరుగులమీద గూర్చుండి లోకాభిరామాయణమును ముచ్చటించుకొనుట కారంభిం చిరి. కథాప్రసంగమున నగ్గిరాముని సంగతి తేబడినది. విశ్వనాథ మాత్రుతతో వినుచుండెను.

"ఏమిటి సుబ్రహ్మణ్యం వాని దర్జా! దర్శనమిచ్చినాడంటే కొంప ముంచిపోయినాడన్నమాట! మర్యాదగా కాలక్షేపముచేసి ... ఆపై నిక ఫరవాలేదు, విన్నావుగా మొన్న సీతారామయ్య

"వినలేదు. నిన్న చెప్పెదనని చెప్పితివికావు. పోనిమ్మీవేళ నైన చెప్పెదవా ? నమ్మెదవో లేదా కాని, ఆమధ్య కిర్లంపూడి ప్రయాణము నేనీ భయముచేతనే మానినాను. ప్రకాశం ! సీతా రామయ్యగారి సంగతేమిటి ? ఎవరాయన ? తీరుబడిగా, నీవేళనైననను చెప్పి పొమ్ము."

"కాకినాడప్లీడరు సీతారామయ్యగారి నెఱుగవా ? చెప్పెద వినుము. ఆయన కడసారివాయిదా కేదో కేసులో పెద్దాపురం కోర్టుకు పోయినాడట. సాయంకాలము కాకినాడ బండికేమో ఆయన తిరిగి వచ్చునని అగ్గిరామునకు తెలిసినది. వానికి తెలియని సంగతి లేదు. ఎక్కడ నెవ్వరేవేళకు ప్రయాణమో ఏమాత్రములాభించునో వివర ముగా వానికి ముందే తెలియును. ఎవరో యిద్దఱితో వాడు సీతా రామయ్యగారు వచ్చుమార్గమున నిల్చినాడట చెప్పుట మరచితిని. ఈనడుమ దొంగరాముడును, బలేరాముడును, వానితో కలియక మండపేటమకాము పెట్టినారట. వారితో పనియుండిన అగ్గిరాము డచ్చటికేగుచుండునట. ఇట్లుండగా సాయంకాలమునకు సీతారామయ్య గారు సైకిలుమీద విసురుగా వచ్చుచుండగా రోడ్డుప్రక్కనున్న యగ్గి రాముడు దారికడ్డయి టక్కున సైకిలాపెనట. ఆపైన ఏమయ్యా ! డబ్బేది ? ఫీజు మాకిచ్చిపొండి ! అన్నాడట అగ్గిరాముడు.

అబ్బే ! నేను డబ్బేమియు తేలేదు. అని ప్లీడరనెను.

ఇంతట వానితోనున్న యిర్వురును ప్లీడరు జేబులు వెదుకు చుండగా అగ్గిరాముడు కుఱ్ఱనాగమ్మలారా ! ఊరకుండుడు. ఆయనే మర్యాదగా నిచ్చివేయును అని మందలించినాడట ! వీని మర్యాద గాల ! ఏమయ్యా ! మర్యాదగా యిచ్చినమంచిది. ఎక్కడనుండిరావా గాణానుకొని సులభముగా దొరకునని నీయొద్దకు వచ్చినాము.

నిష్కారణముగా మమ్ముల్ని టోపీవేసినావా యేమిటి ? గున్నేఱు దువా ?" అన్నాడట అగ్గిరాముడు.

ఆప్లీడరొక అగ్గిరాముడు. ఆడబ్బును పెద్దాపురమునుండి తన పేరనే కాకినాడ మనిఆర్డరు పంపితినని చెప్పగా అగ్గిరాముని కలవి కానికోపము జనించెను. "ఏడ్చినట్లేయున్నది. ఇంతదూరము నిష్కారణముగా వచ్చితిమి. ఆబట్టలు విప్పిపొమ్ము" ప్లీడరాలోచించు చుండెను.

ఇంతలో వారిలో నెవడో బైసికిలుగైకొని దానినెక్కుటకై ప్రయత్నించుచుండెను. అగ్గిరాముడు వానినాపి "ఓరి! తెలివి తక్కువవాడా! సైకిలుకు నంబరుండును. అది మన కెందులకు ? ఇచ్చివేయుము అని వాని యొద్దనుండి దానిని దీసికొని ప్లీడరుకిచ్చి నాడట. ప్లీడరు సంతోషించి అగ్గిరాముడు! చాలసంతోషమైనది. మీరంతా నాతోరండి. కాకినాడలో బహుమాన మిచ్చెదను." అనెను.

"వచ్చెదము కాని, నన్నెఱుగుదురా ? మోనముమాత్రము వలదు." అని శెలవిచ్చి వెంటబడినారట. కాకినాడలో వాండ్రకు పిండివంటలు, ఫలహారములు, క్రొత్తచాపులు, తలకొక యెదురూప్య ములు బహుమానము ! ఇక మజా విను ! ఇంకెప్పుడు నాప్లీడరునకు భయములేదు. చీకటిలో ప్రయాణమైనచో తోడుగా సాగనంపును. అగ్గిరాముని జన్మమునకు మర్యాదకూడను !

"వానిసంగతి తెలిసియే నేను ప్రయాణము మానివేసితిని. ఈరాత్రి కెచ్చటనుండునో తెలిసిన బాగుండును."

"ఎట్లు తెలియును ? వానిసంగతికంటె మనసంగతి వానికే ముందుగా తెలియును. సుబ్రహ్మణ్యముగారి రాత్రి బండ్లు కట్టించు నప్పుడే ఆయనపోవుమార్గమునకు ముప్పది నలుబది మైళ్ళ

దూరగమునుండి అగ్గిరాముడు విజయముచేయును. ఆపైన మజా చూచి కొనుము. ఒకతడాఖా తీయకుండ విడిచిపోడు. నీవు లక్షమందిని వెంటబెట్టుకొని పోయినను నీప్రయాణ మాఖరగునప్పటికి నీడబ్బును పెట్టెలును నీయొద్దనుండవు. రాత్రి ప్రయాణములుమాని పగలు బయలు దేరుదమన్నను యింతే!" అని యిర్వురు నేమేమియో లోకాభి రామాయణమును మాట్లాడుకొనుచు నాయరుగుపై కొంతకాలము గూరుచుండి, వెడలిపోయిరి.

ఆరుగంటలాయెను. విశ్వనాథము లోనికేగి రాత్రిభోజనమున కుండెదనని గుమాస్తాతో చెప్పి తిరిగి వీధియరుగుమీద గూర్చుండెను. చీకటివ్యాపించెను. భోజనమునకు లేచువేళవఱకును విశ్వనాథము వీధి యరుగుపై గూర్చుండెను. కాని, విశేషము లేమియు నాతనికి గోచ రింపలేదు. రాత్రి గుమాస్తాగారితో ప్రసంగించి తిరిగి కాకినాడ పోవల యునని నిశ్చయించుకొనెను. ఆ రాత్రి భోజనమున కితరబ్రాహ్మణు లెవ్వరును లేకుండుటచే గుమస్తాతో స్వేచ్ఛగా ప్రసంగించుట కతనికవ కాశము కలిగెను. వారికీ క్రిందిసంభాషణ జరిగెను.

"ఏమండీ కృష్ణయ్యగారు! భోజనముచేసి పెద్దాపురము పోవల యును. కొంచెము దన్తున్నది. ఎంతదూర ముండును? దారి మంచి దేనా?"

"అయ్యా! తమకీప్రాంతము క్రొత్తకాబోలును. నామాట వినుడు. రాత్రులందుమాత్ర మీప్రాంతముల ప్రయాణముజేయుటకు ఎద్దతక్కువపనియుండదు. అందును నొంటిగా ప్రయాణ [illegible] వలదు."

[illegible]టనెదరు? దొంగలభయము విశేషముగా నుండునా [illegible] నుండ[illegible] అట్లయిన బండీ మాట్లాడుకొనియెదను."

"వెఱ్ఱినమ్మకమువలదు. నిష్కారణముగా మోసపోయెదరు. ఈప్రాంతముల నగ్గిరాముడను దొంగలగురు వొకడున్నాడు. వానికి బండ్లున్నను లేకున్నను నొక్కటియే. పదిబండ్లనొక్కడే ఆపి డబ్బు నూడ్చిపెట్టిపంపించును. చాలమంది మోసపోయినారు. తొందరపసియైనను రేపేగవచ్చును."

"ఒకటి రెండు పర్యాయములు వీసిపేరు వింటిని. వాడంతవాడుటండీ! ఈనడుమనేమైన జరిగెనాయేమిటి?"

"ప్రతిరోజు నేదియోయొక రోడ్డున జరుగుచునే యుండును. ఎచ్చట నేవేళకుండునో చెప్పలేము. ఈనడుమ నారుబండ్ల కడ్డమువచ్చి పండ్రెండుగురు మనుష్యులను గోచీగుడ్డలతో సాగనంపినాడు. వాడు తలచినచో వెంట నెందరో యుండురు."

"అంత బలగమున్నదా? మొన్న జరిగినసంగతి కొంచెము వివరముగా జెప్పెదరా. వినుటకు కుతూహలముగా నున్నది.

"పోలీసుజవానులు వానికి వంగివంగి సలాములు చేయుదురు. ఎన్నాళ్ళనుండియో వానిని బట్టుకొనుటకు పోలీసు విశ్వప్రయత్నము చేయుచున్నారు. కాని, వానిదర్శనమైన గాలేదు. ఇప్పటి కెనిమిది దినములక్రిందట రాత్రియందొక కోమటి పెండ్లికిబోయి సంసారముతో తిరిగి వచ్చుచుండెను. చామర్లకోట రైలుస్టేషనున కొక మైలీవల హఠాత్తుగా నేడుగురు మనుష్యులా బండ్లమీద బడిరట! బండ్లవాండ్రందరు దిగి వానికి దండములుపెట్టుచు వణకుచుండిరట! అంతట నగ్గిరాముడా సాహుకారును బిల్చి సామానులు విడిచిపొండి" అని భయంకరముగా జెప్పునప్పటి కతడు పెట్టెయు బేడయు నిచ్చివైచెనట! బండిలోనున్న దుద్దు దుసుకు దీసికొని కట్టుబట్టలతో సాగనంపినాడట! వాండ్రను చామర్లకోట సమీపమువఱకును సాగనంపి బండ్లకు తానే ద్దెనిచ్చి పంపెనట! చూచితిరా వీనిసరసము?"

విశ్వనాథ మాశ్చర్యమభినయించెను

భోజనమైనతర్వాత విశ్వనాథము గుమాస్తాయొద్దకు బోయి "అయ్యా! కాకినాడలో బంధుగులయింటికిబోయి రేపుదయమున బయలుదేరి పెద్దాపురమేగెదను." అని శలవుదీసికొని రాత్రి పండ్రెండు గంటలన్నర కాతడు కాకినాడజేరెను. తాను వినినసంగతులన్నియు దాసున కారాత్రియే దెలిపి నిద్రబోయెను.

## 4

విశ్వనాథ ముదయముననే నిద్రమేల్కొనునరి కెవ్వరో పోలీసు జవాను లిర్వురు సుబ్బారావుగారితో మాట్లాడుచుండిరి. వారలసంభాషణవలన గడచినరాత్రియం దెచ్చటనో దొంగతనము జరిగియుండె నని విశ్వనాథము గ్రహించెను.

"రాత్రి పండ్రెండుగంటలు కూడ కాలేదండి! కేకలూరికేవిన బడునప్పటి కూరిలోనుండి పర్వెత్తుకొనివచ్చినాము. మెట్టపాలెము వంతెన కొకమైలీవల నదేగోల. అదేగోల! దమ్మిడీకూడ మిగల్ప లేదట!"

"సంగతి నంతయు రిపోర్టులో వ్రాసితివికదా ప్రయాణీకుల యొద్ద వాఙ్మూలము పుచ్చుకొంటిరా? అగ్గిరాముడున్నాడని చెప్పిం కాదూ?"

"ఔనండి. మొత్తము పదిమంది ఉన్నారట. అపాయము మాత్ర మెవ్వరికి జరుగలేదట. యజమాని శాస్త్రిగారు కేకలు యునప్పటి కగ్గిరాము డాయనగొంతుక నొక్కి దుడ్డుచూపినాడట!"

ఇంకముందైనను కొంచెము జాగ్రతగా తిరుగుచుండుట మంచిది నిష్కారణముగా చాలమంది మోసమునొందుచున్నారు. [illegible] డుగారు [illegible]చో ఈరాత్రినుండి స్పెషల్‌డ్యూటీగా యింకొకయిద్దఱు కనిస్టే

..లను దీసికొనిపోండు. వాండ్రెచ్చటినుండి ప్రయాణము? ఎందులకు ప్రయాణమై పోవుచున్నారు? ఏమాత్రము పోయినది?”

“వారు తాళ్ళరేవు పెండ్లికేమో పోవుచుండిరి. రొఖముమాత్ర మెమియు బోలేదు కాని; తెచ్చిన నగలును బట్టలును పోయినవట.”

జవాను లిద్దఱును సలాముజేసిపోయిరి. విశ్వనాథము నిద్రలేచె ..నె గ్రహించి, సుబ్బారావు చిరునగవుతో వాని గదిలో ప్రవేశించెను.

“ఏమండోయి! తిరిగి యెప్పుడు వచ్చితిరి? జవానులు చెప్పి వింటిరా నిన్న రాత్రి తిరిగి కోరంగిరోడ్డున నెవరో పెండ్లికిపోవు ..ండగా, అగ్గిరాముడు మార్గమునందే పెండ్లిచేసి పంపినాడట.”

“ఏదో నిద్రమత్తున విన్నాను. సరిగావినలేదు. ఇప్పుడే నిద్ర ..చినది. వెనుకకు రావలసి తిరిగిపోవచ్చునని వచ్చితిని.”

“ఐతే వినండి. ఇదిగో రిపోర్టునుండి చదివెదను” అని సుబ్బా.. తన చేతులోని కాగితమును విప్పి సందర్భానుసారముగా నిట్లు చదివెను.

“నిన్న రాత్రి పండ్రెండు గంటలకు కోరంగిలో గస్తీ తిరుగు ..డగా కాకినాడరోడ్డున గొల్లుమని యేడ్పులు వినబడినవి. పరుగు ..యుచు మేమిద్దఱము నారోడ్డున బోతిమి. మెట్టపాలెమువంతెనదాటి యొకమైలు రమారమిపోవునప్పటి కచ్చట ముగ్గురు బండివాండ్రును, ..లోని జనమును గోలచేయుచుండిరి. సంగతికనుగొనగా ... ంది చెప్పిరి — అమాంతముగా పదిమంది బండ్లపైకురికి ఎద్దులను అంతట వారిలోకొందరు బండ్లలోని జనమును క్రిందకీడ్చిరి. ..జవాని శాస్త్రిగారు కేకవేయునప్పటి కగ్గిరాముడు వానిగొంతుక ..జ్జిచూపింపగా నాయన యూరకొనెను. దొంగలు పెట్టె బేడ ..ని పారిపోయినారు. మేమేగునప్పటికి వారింకను బండ్ల.. ..తాళ్ళరేవు పెండ్లి బోవుచున్నారట—”

"వింటిరా విశ్వనాథముగారు ! అనుకొనని దారినిగూడ బయలు దేరినాడు. వానిసంగతి త్వరలో జాగ్రతపెట్టకపోయినచో, కొంప మీదికి రాగలదు. దీపిస్తై మగల సూవరింపెండెంటేమి సవారీ చేయునో"

"అంతవఱకు వచ్చిననే కాదూ, వాడేమైన చేయునని భయము ? సాధ్యమైనంతత్వరలోనే వానిని బట్టుకొనుటకై ప్రయత్నములు చేసెదను మీరుమాత్రము నిశ్చింతతో నుండుడు"

"మీదయ వాండ్రు మీకు దొరకెదరన్న నమ్మకము నాకు లేదు. ఏలనందురా ? వాండ్రకొక రోడ్డని లేదు. ఎక్కడ నుందురని మనము వెంటాడుట !"

"అట్లుకాదు సుబ్బారావుగారు ! క్రొత్తసంగతి నా కొకటి తెలిసినది. వినండి చెప్పెదను. అగ్గిరాముడు వేరుగా తిరుగుచున్నాడట ! మిగిలిన యిద్దఱును అనగా దొంగరాముడు, బలేరాముడును మండపేట సమీపమున మకాము పెట్టిరట ! ముగ్గురును గలిసి తిరిగినచో పట్టుబడెదరని కాబోలు నీయెత్తునెత్తిరి. ఇది మనకు జాల నుపయోగము. ఆయిద్దఱను పట్టుకొంటిమా, అగ్గిరాముడు సులభముగా మనవలలోపడును."

"ఇదే నిజమైనచో నింకేమికావలయును ? మీరీ సంగతి నెచ్చట దెలిసికొంటిరి ? మండపేట పోయివచ్చితిరాయేమి ? -

"లేదండి, సామర్లకోటకేగి వచ్చితిని. ఈ సంగతి నాకచ్చటనే తెలిసినది. అది నిజమేయై యుండును. వాండ్రను బట్టుకొనుట కొకమార్గము పన్నితిని — ఈవేళ కోరంగిపోయి రావలయునని యున్నది. ఇప్పుడే భోజనముజేసి నేనును దానును పోయి వచ్చెదము. రాత్రి బయలుదేరి మండపేట కేగెదము. మీకు భయమేమియును లేదు. సాధ్యమైనంత త్వరలో మీపని నెరవేర్చెదను. సెందలం

భోజనము పెట్టించిన జాలును. దాసు! లెమ్ము. స్నానము జేయుదము"

ముగ్గురును లోనికేగి స్నానముజేసిరి. భోజనమైన తర్వాత బండి కట్టించుకొని విశ్వనాథమును, దాసును కోరంగికై బయలు దేరుచుండగా సుబ్బారావు "నేను కూడ మీతో రావలయునని యున్నది. శోధనకై పోయితినని డైరీలో వ్రాసెదను రమ్మనెదరా?" అని యడిగెను.

విశ్వనాథమంగీకరించెను. మధ్యాహ్నము పండ్రెండుగంటలకు ముగ్గురును దొంగతనము జరిగినస్థలమును జేరిరి. ఎండ తీక్షణముగా లేకుండుటచే వారి కేవిధమైన యలసటయును లేకుండెను. విశ్వనాథ మా యిద్దఱ కావిషయములను బోధించుచుండెను. విశ్వనాథము వానిని సమగ్రముగా పరిశీలించెను.

అయ్యా! సుబ్బారావుగారు! దొంగ లీ దారినే సామానుతో పోయియుందురు. ఇదిగో రోడ్డునకు తూర్పుప్రక్కనున్న యీయడుగు గులజాడ వాండ్రు వచ్చినది. పదచిహ్నము లన్నియు స్ఫుటముగనే యున్నవి. ఇదిగో యీదారిని తిరిగి వాండ్రుపోయినారు. సామానుతో పరుగెత్తుటచేకాబోలును మడమలు సరిగా ఆనలేదు. అగ్గిరాము డై దడుగులవాడనిచెప్పితిరి కాదూ! ఇదిగో యీ యడుగులు వానివి. ఈ యడుగునకు నాయడుగునకు చూచితిరా దూరము. ఇవి తప్పక వానియడుగులే వానిదెంతపాదమండి! సుమారు పదునొకండంగుళము లుండును."

"వీరభద్రపాదమువలె నున్నదే?" అని సుబ్బారావు నవ్వెను.

"దాసు! బండివానిని పంపించుము. మనమీదారి ననుసరించి పోవుదము, ఏమనెదరు సుబ్బారావుగారు?"

"మీకొలవు కావలసినచో తిరిగి దొరుకునులెండు."

దాను బండివానికద్దెనిచ్చి పంపించి తిరిగి విశ్వనాథమును సుబ్బారావును గలిసికొనెను. ముగ్గురు నాయడుగుల జాడ ననుసరించి పోజొచ్చిరి. ఇట్లు కొంతదూర మేగినపిదప దూరముగా డొంకలో నేదియో యొకవస్తువు విశ్వనాథముకంట బడెను. అత డచ్చటికేగి తన చేతికఱ్ఱతో దానిని పైకిలాగెను. అదియొక నల్లనిచేబాడిదకఱ్ఱ. గజము పొడుగున నున్నది. సుమారు పదంగుళముల కైవారము గల్గియున్నది కాని, చివరకొంచెము పగిలియున్నది. విశ్వనాథము దానిని తనచేత బుచ్చికొని దానును, సుబ్బారావును నిల్చియున్నస్థలమును సవ్వాచు జేరెను.

"ఇదిగోనండోయి మీ అగ్గిరాముని దుడ్డు! చివర పగిలిన దనియో చేతియందు బరువెక్కువగ నుండుటచేతనో కాని, దీనిని వాడుపారవైచినాడు. ఇంతదుడ్డును గనుబరచినచో ప్రాణములు మీంది కెగసిపోవును." అని చెప్పి పరీక్షార్థము వారల కద్దాని నొసంగి, అయడుగులజాడ ననుసరించి వారితోపోజొచ్చెను.

ఆజాడ గురజనపల్లి యను గ్రామసమీపమువఱకును స్ఫుట ముగా కనబడినది కాని యాపై నగుపడుట మానెను. విశ్వనాథ మెంత ప్రయత్నించినను దిరిగి జాడనుదీయ లేకపోయెను. బహుశః అగ్గిరాము డాయూరినుండి రాత్రికిరాత్రియే పోయియుండునని నిశ్చయించుకొని గురజనపల్లిలో బండి నొకదానిని మాటలాడుకొని ముగ్గురును సాయం కాల ~ రుగంటలకు కాకినాడ జేరిరి.

రాత్రి భోజనమొనర్చి సుబ్బారావుతో విశ్వనాథము చాల ... మాటలాడి కొన్ని యేర్పాటు లొనర్తునని వానిచే వాగ్దా ... గొంది తెల్లవారుఝామున నే దానును లేపి యిరువురును

కలిసి రైలుస్టేనును జేరిరి. ద్వారపూడికి టిక్కెట్టును గొని, తన దుస్తులపెట్టెను దాసునకొప్పగించి, జాగ్రతగా కాలువగట్టున నున్న సత్రమున దిగుమని సలహానొసంగెను. ద్వారపూడిలో దాసు దిగునప్పటి కాతనికెందును విశ్వనాథము కనబడలేదు. ఏదియో యోచించుచు, తుదకాతడు సత్రమునుజేరి యచ్చట మకాము జేసెను.

# 5

దా నుదయకృత్యములను దీర్చికొని విశ్వనాథ మానతి చొప్పున ద్వారపూడియూరిలోనికి బోయెను. ఎక్కడ వినినను, ఎవరుచెప్పినను, పోలీసువారలను చాలకాలమునుండి వేధించుచుండిన ఈరామమ్త్రయము చేయు దుర్ణయప్రకరమే! రాత్రి యేడు గంట లగునప్పటికి విశ్వనాథము అరిగి దాసు గది ప్రవేశించెను.

"దాసూ! జాగ్రతగా నుంటివా? ఎక్కడకుబోయితి నను కొంటివి? అప్పటినుండియు నిక్కడనే యుంటివా?"

"ఇక్కడనే యుండియుంటిని. ద్వారపూడియూరంతయు ప్రదక్షిణము జేసితిని. ఎవ్వరు చెప్పినను వీరలసంగతియే. చాల ఘోరకలిగానున్నది. ఎక్కడ కేగితివి? కూపీనేమైన సంపాదించితివా?"

"కూపీ యేమియు దెలియలేదు. తిరిగి రాత్రిప్రయాణమై పోవలయును లెమ్ము త్వరగా భోజన మొనర్పవలయును." ఇర్వురును చి భోజనమునకు బోయిరి. ఆయిద్దరునుమాత్ర మప్పటికి మండపేట ...వమునసే యున్నట్లు తెలిసినదని విశ్వనాథము దాసున ...లెంగు చెను

భోజన మైనతర్వాత విశ్వనాథము తన పెట్టెలోనుండి చిరిగిన బట్ట నొకదాని—బాగుగా మాసినదానిని—కట్టుకొని, అట్టి దానినే చొక్కాయి నొకదానినిధరించి, తన పిస్తోలును గైకొని, దానును జాగ్రత్తగా నుండవలయుననిచెప్పి, మండపేటదారిని బయలుదేరి పోయెను. రాత్రి 10 గంటల కాతడు మండపేటవంతెనజేరి, దాని కావలగా రెండుఫర్లాంగుల దూరమున; చెట్లచాటునడాగి, తన పిస్తోలును చేతికందునట్లు మొలయం దమర్చుకొని, వేచియుండెను. రేయుచుగా దొంగతనము లాప్రాంతముల జరుగుచుండునని విశ్వనాథము వినియుండుటచే కాబోలు నాత డీప్రాంతములనే వేచియుండుటకై నిశ్చయించుకొనెను.

రాత్రి పండ్రెండుగంట లాయెను. తనవెనుకనుండి పిల్లకాలువను దిగి ఎవ్వరో ఐదుగురుమనుష్యులు వచ్చుచున్నట్లు విశ్వనాథము గుర్తించెను. ఆయైదుగురిలో వెనుక తాను వినియున్న వర్ణనలనుబట్టి విశ్వనాథము దొంగరాముని బలేరాముని సులభముగా గ్రహింపగల్గెను! అక్కడనే డాగియుండుట శ్రేయస్కరము కాదని తలంచి, విశ్వనాథ మీవలకువచ్చి రోడ్డుపై నిలిచి, జాగ్రతగా నిల్చియుండెను. వీనిని చూచి, కొంచెము సంశయించి తిరిగి తమలోతా మేదియో గుసగుస లాడికొని, ఆయైదుగురును రోడ్డుపై కరుదెంచిరి. అందొక్కడు వీనిని జేరవచ్చి "నీవెవ్వడవు?" అని ప్రశ్నించెను. "నే నెవ్వడనైన నేమి? మీరు మిత్రులా లేక శత్రులా?" అని విశ్వనాథము వారి మొగములను బరిశీలించుచు బల్కెను.

దొంగరాముడు మూడడుగులు ముందునకువచ్చి, విశ్వనాథ మును తేరిజూచి, "మేము మిత్రులమో, శత్రులమో నీవే నిర్ణ

యించవలయును. ఇదివఱ కెన్నడును, నిన్ను జూచియుండలేదు" అనెను.

"అట్లయిన చెప్పెద వినుము. నే నిచ్చటి కగ్గిరాముని దండులో చేరవలయునని వచ్చితిని. నాకాపురము చామర్లకోట ఎన్నినాళ్లు తిరిగినను, నా కగ్గిరాముడు కనబడలేదు. ఇక్కడ నుండునని తెలిసి యిచ్చటకు వచ్చితిని. ఇందులో అగ్గిరాముడెవ్వరు ?"

ఈపల్కులువిని, వారించుక దూరముగానేగి, తమలో గుసగుస లాడుకొనిరి. తిరిగి వానిని సమీపించి, "నీ పే రెవరు ? నీ కగ్గిరాము డెందులకు ?" అని వారలలో నొకడు ప్రశ్నించెను.

"నాపేరు విస్సిగాడు. నే నీడిగవాడను. తినుటకు తిండిలేక, పొట్టకై అగ్గిరామునితో కలియవలయునని బయలుదేరి వచ్చితిని. అగ్గిరాము డెవ్వరు ?"

"అగ్గిరాముడు లే డిక్కడ; ఎక్కడ నున్నాడో మాకు తెలియదు. సీదారిని పొమ్ము" అని దొంగరాముడు వానికి దారిని జూపెను.

"అగ్గిరాముడు లేకపోయిన వానిస్నేహితు లున్నారట — దొంగరాముడు, బలేరాముడు అని వాని స్నేహితు లిక్కడ నెక్కడనో యున్నారట. వారలజాడ చెప్పినను నరే, వారికాళ్ళపై బడి బ్రతిమాలుకొనెదను. బాబూ !. తినుటకులేదు. పొట్టను చేతితో పట్టుకొని తిరగవలసినది. ఆసంగతినైన జెప్పరా ?"

అగ్గిరాము డాగుంపులో లేడని విశ్వనాథ మెఱుంగును. ఆతని మాటలకు వారెల్లరును నవ్విరి. తిరిగి కొంతదూరము వెనుకకు బోయి, వారలలో నిద్దరు గుసగుస లాడి, విశ్వనాథము చెంతకుబోయి "విస్సిగా ! నీ వేమిచేయగలవు ? వాండ్రెందుకు నీకు గావలను ?" అని విశ్వనాథము దేహమును బరీక్షించుటకు కాబో

లును, వానిభుజముపై దొంగరాముడు చేయివైచెను. ఆచేతిని విదళించుకొని, విశ్వనాథము, "వాండ్రను బ్రతిమాలుకొనినచో, నాకు తిండి పెట్టెదరని నమ్మకముండి వచ్చితిని. వాండ్రలో కలిసి నేను గూడ దొంగతనములు చేయుటకు బోయెదను. వాండ్రెక్కడ నున్నారు?" అని పల్కెను.

దొంగరాముని మొగము నుజూచిన, విశ్వనాథము చెప్పిన మాట లాతనికి నచ్చలేదనియు నేదియో ననుమాన మున్నట్లు గ్రహింపవచ్చును. అందున నీమధ్య వారలను బట్టుకొనుటకు పోలీసువారహోరాత్రములు ప్రయత్నములు చేయుచుండిరికదా? ఈతడు వారలలో వాడేల కాకూడదు? అందులో నొక్కని దూరముగాబిల్చి దొంగరాము డేమియో మాట్లాడుచుండెను. దొంగరాముడు స్ఫురద్రూపి యని విశ్వనాథము గ్రహించెను.

ఐదునిమిషములైన తర్వాత వారిద్దరును తామున్న తావునకు మిగిలిన ముగ్గురును బిలిచికొనిపోయిరి. తిరిగి కొంతకాలమునకు గుసగుస లాడిన తర్వాత వారందరును హఠాత్తుగా వచ్చి విశ్వనాథముపై కురికిరి. విశ్వనాథ మిట్లుజరుగునని యింతకుబూర్వమే గ్రహింపగలైను కాన, ఎక్కువనేర్పుతో వారలను తప్పించుకొని, తన మొలనున్న పిస్తోలును పైకిదీసెను. దొంగరాముడు వానిని జూచి,

"ఒరే బలేరామ్! పోలీసువెధవే! పోనీయక పట్టుకొనుడు" అని కేకవైచెను. విశ్వనాథము తన్నువీరలు గుర్తించి, తనకార్యములు గ్రహించితిరాయని యనుమానించి ఏమైనను బరిశీలింపవలయునని, నిబ్బరమును దెచ్చుకొని,

"ఉన్నస్థలమునుండి కదలబోకుడు! మోసము రాగలదు! నేను పోలీసువాడను కాను. నేను మీలోవాడనే; నన్ను పోలీసు వెధవలు ఖయిదుగా నిచ్చుటకు పారిపోయి వచ్చితిని. నన్ను వాకు

మీలోవాడ ననుకొన్నారు. నేను పోలీసువాడను కాను; నిష్కారణముగా నన్ను బాధించినచో, ఇదిగో నాచేత పిస్తోలున్నది. నా మాట నమ్ముడు!" అని విశ్వనాథము భయంకరముగా నరచెను.

వాని వాక్యములకు దొంగరాముడించుక సంతుష్టుడై, మాకు నమ్మక మేమిటి? మాసంగతి నెరుంగుదువా? మోసముచేసితివేని గుండె పగులదన్నెదను. అని విశ్వనాథమును సమీపించుచు పల్కెను.

ఎన్నిదినములనుండి మిమ్ములను బట్టుకొనుటకై పోలీసువారు ప్రయత్నము జేయుచున్నారు? మీరేమైన దొరికినారా? మీ రున్న స్థలమైన తెలిసినదా? వారలా మనలను పట్టుకొనుట! నామాట నమ్మకముండిన నామాట వినండి; చెప్పెదను. దొంగయునికి తెలిసికొనుట దొంగకే సాధ్యము. అందుచేతనే మీరిచ్చట దొరుకుదురని ధైర్యముగా నిచ్చటకు వచ్చినాను. ఈమాత్రము తెలివితేటలు పోలీసువారికే యున్నయెడల మనల నందఱ నీ పాటికి హతమార్చరా? ఇప్పటికైన నామాట నమ్మక మున్నదా? అని విశ్వనాథము పలికెను.

దొంగరాముడు వానిని సమీపించి భుజముపై చేయివైచి "అన్నా? విన్నన్నా! నమ్మకము లేకేమి? నీవు పోలీసువాడ వని నాకెప్పుడును నమ్మకము లేదు. ఏమాత్రము బలమైనవాడవో చూడవలయునని అట్లుచేసితిని. కోపము నొందవలదు. మన మెల్లరము నొకజాతివారమేసుమీ! నాకు సంతుష్టి గలుగజేసితివి. నీ విక ముం దెక్కడ నుందువు?" అని ఆదరణతో పల్కెను.

అన్నా! నాకు కొంపలేదు. మీతో కలిసి యుండెదను. ఇప్పుడు తిరిగి నాయూరికేగి తిరిగి రేపురాత్రి వచ్చి యిచ్చటనే

మిమ్ములను గలిసికొనెదను దుడ్డూనునుకూ తెచ్చుకొనెదను. బాగుగా నమ్మకము కుదిరినదా ? ఇంకేమైన ననుమాన మున్నదా ?

ఏవిధమైన అనుమానమును లేదు. ఎందుల కుండవలయును ? జరిగినదానిని మరచిపోవలయును మనమూమాత్రము జాగ్రతగా లేకున్న మోసము జరుగదా ? మనసంగతి యటువంటిది బోధపడినదా ?

ఔనౌను. మఱి నాకు శల వొసంగినచో పోయి రేపురాత్రికి వచ్చెదను. నన్నెవరయిన నిచ్చట గలిసికొనిన చాలును. మీ యింటికి వచ్చెదను. చిన్న బట్టలమూట మాత్రముండును.

నేనే కలిసికొనెదను లెమ్ము వీడిని చూచితివా ? వీడే బలేరాముడు. బలేరాముడు పండ్లికిలించెను.

అట్లా ? రేపటినుండి అంతయు మనమేకదా ? శలవిచ్చిన పోయెదను చాలదూరము పోవలయును.

సరేపొమ్ము. రేపీవేళ కిక్కడనే యుండెదను. తాను వచ్చిన దారినే విశ్వనాథము పోయెను. మండపేటవంతెన సమీపమున నేదియో యీల వినబడుటచే నాతడు వెనుదిరిగి చూచి వడిగా నడువసాగెను. వానివెంబడి నెవ్వరును వచ్చుచున్న ట్లాతనికి గనబడలేదు. వారి కేవిధమైన యనుమానమును లేదని తలంచి విశ్వనాథము తెల్లవారుఝామున ద్వారపూడిసత్రమున జేరి దానును లేపి తనగది ప్రవేశించెను.

## 6

నాల్గుదిక్కులను కలియజూచి, వెన్నంటి యెవ్వరును రాలేదని నిశ్చయించికొని, తనగది ప్రవేశించినంతనే విశ్వనాథ మొక పెద్దనవ్వు నవ్వెను.

"దాసూ! లేచి, దొంగ, అని కేకవై చెదవేమో, నేను విశ్వనాథమును. నమ్మకమున్నదా?" దాసు విరగబడి నవ్వుచుండెను.

"ఏమైనా కూపీ లాగితివా యేమి? నీసంగతి జూచినట్లే బోధపడుచున్నది" విశ్వనాథము తనవేషమును పొదుపుగా తీసి దాచి, తన మామూలు వేషమును ధరించెను.

"దాసూ! దర్శనమైనదోయి!" అని తనచర్య నంతయు సవిస్తరముగా విశ్వనాథ మెఱింగించెను. తరువాత నాతడు మంగలి కొక్కసిని బిలిపించి, తన కేశములను దగ్గరగా కత్తెర వేయించెను. తిరిగి సాయంకాలమునకు యథాప్రకారముగా మాసినగుడ్డలను ధరించి, తాను ధరించియున్న గుడ్డలకుతులయగు కొన్నింటిని మూటగాగట్టుకొని, పిస్తోలును మొలయందమర్చుకొని ప్రయాణసన్నాహమంతయు గావించెను.

"దాసూ! తిరిగి నేను పోవుచున్నాను. బహుశః ఈసారి మూడు నాలుగు దినములు కూడ కావచ్చును. నేను రాలేదని నీవేమియు నసనుకొనవలదు. నేను చెప్పినసంగతులన్నియు సుబ్బారావు గారి పేర వ్రాసి తగినయేర్పాటులు గావింపవలసినదని తెలియజేయుము జరిగిన చర్యనంతయు వ్రాయుమలదు" అని కొంతసేపాతనితో గుసగుసలాడి విశ్వనాథము నాల్గుదిక్కులను బరీక్షించి, యెవ్వరును లేరని నిశ్చయించుకొని, వడివడిగా మండపేటదారిని బోయెను. రాత్రిగాఢాంధకారముగా నుండెను. ఆకాశము మేఘమయమై యుండెను. నరిగా దారికూడ కనబడుటలేదు. అట్టికటికచీకటిలో నర్ధరాత్రియందా మండపేటకు బోవురోడ్డున కొంచెము వర్షించిన తర్వాత నడచుట యెంత కష్టమో ఆమార్గమున బోయెడు వారికే తెలియగలదు. కాని విశ్వ

నాథ మిట్టి విషయములయం దారితేరినవాడనియు, చీకటిలోనైనను; 50 గజముల దూరముననున్న వస్తువులను గుర్తింపగలడనియు మూ పాలకు లెటిగిన యంశమే. అందుచే నాతనికి విశేషకష్టమేమియు దోచలేదు. అంతియేకాక తానొనరింపబోవు దుర్ణయమునకు సరియగు కాలమిదియే యని యాతడుత్సాహము నొందెను. రాత్రి పదిగంటల కాతడు తాను వెనుకటిరాత్రి డాగియుండిన స్థలమునుజేరి చెట్లుచాటున నిల్చియుండెను. అతనికొఱకై వేచియుండిన దొంగరాము డిరువది గజముల దూరముననుండి, యాతనినిట్లు పలుకరించెను.

"విస్సన్నా! వచ్చితివా? బట్టలమూట దెచ్చికొంటివా! వరే! ఈపిల్లకాలువ దిగిరమ్ము కొంచెము పనియున్నది"

"తెచ్చుకొంటిని, ఏమిపనియున్నది?"

"కాలువదిగి రమ్ము. త్వరగా పోవలయును. ఆలస్యమైనచో మనవాండ్రు తగులబెట్టెదరు. ఆపైన కొంప మునుగగలదు!"

విశ్వనాధమును దీసికొని, దొంగరాముడు పిల్లకాలువగట్టుపై బడిపోవుచు తన తొందరపని నీ రీతిని జెప్పసాగెను.

"ఈరాత్రి కాకినాడనుండి యొకవర్తకుడు రెండువేలరూపాయిల దస్తుతో రామచంద్రపురము వచ్చుచున్నాడు. రాత్రి తొమ్మి గంటలకు బయలుదేరినాడట. తెల్లవారుఝామునకు రామచంద్రపురము జేరగలడు. మనముందూరువంతెనకు రెండుమైళ్ళవల వానితాళము పట్టవలయును. అగ్గిరాముడే స్వయముగా కబురంపినాడు. అతడు రేపు రాత్రి మనమకామునకు వచ్చునట, మనవాండ్రందరును నచ్చటకేగి కాచుకొనియున్నారు. వాండ్రున్నస్థలమునకు బండిమూడుగంటలకురా గలదు. ఇప్పుడు పదునొకండు గంటలైనదికదా మనమచ్చటకు రెండు గంటలలోగా పోవలయును. త్వరగాపోవలయును" అని తనకంటె

నురుగా నడచుచున్న విశ్వనాథముతో దొంగరాముడు నడువ
గొచ్చెను.

ఆవెనుకటిరాత్రి తిన్నెవరు నంటి రాలేదని విశ్వనాథము నంతో
ంంచెనేకాని, యాతనికా గుంపులో నిలకడదొరికిన తర్వాతననగా
మరునాటి సాయంకాలము దొంగరాముడు చెప్పినసంగతుల నెల్ల విని
విశ్వనాథము తనకు గర్వభంగమాయెనని ఖిన్నపడుటయేగాక తానిక
ముందతిజాగరూకతతో మెలగవలెయునని యాతనికి దోచెను. విశ్వ
నాథము వెంటబడి దొంగరాముడు పిల్లకాలువగట్టున నాతనికి స్వల్ప
దూరముననే నడువ నారంభించెనట! దొంగరామునకింకను ననుమాన
ముంతుటచే, నీతడు మండపేట పోలీసుకనిస్టేబుల కేమైన వార్త నంపు
నేమోయని నిర్ధారణజేసికొనుటకై వెంబడించెనట. కాని విశ్వనాథ
మిటునటు బోవక తిన్నగారోడ్డున బోవుచుండుటచే నాతని యనుమాన
మించుక సడలిపోయెను. కాని, తాపేశ్వరమువఱకును బోవ నిశ్చయించు
కొని యొకఫర్లాంగు దూరము వెనుకనుండి ఈలవైచెనట! అది విని
విశ్వనాథము మఱింత వడిగా నడచుటచే, దొంగరాముని యనుమానము
తీరిపోవ నాతడు తిరిగిపోయెనట. తాతకు దగ్గులు నేర్పవలయునా?
తుదకు దొంగరాముడింటికిబోయి తన కూటములో వారితో తనసందే
హము తీరినదని చెప్పెను.

రాత్రి రెండుగంటలకు వీరిద్దరును సంకేతస్థలమును జేరిరి.
బలేరాముడు విశ్వనాథమును జూచి తన సంతోషమును వెల్లడించుట
కునై యొకసారి కొంచెము బిగ్గరగా సకిలించెను. ఆతర్వాత బందిపోటు
పయత్నములన్నియు జేయబడెను. విశ్వనాథము బలేరాముడును బంది
తిమస్థానమును జేరినంతనే చెరియొక యొద్దును విప్పివేయువలయుననియు
దొంగరాముడు బండివానిని క్రిందకులాగి నోటగుడ్డలు గ్రుక్క వలయు

ననియు, మిగిలినవారందఱును, బండిలోనివారు (ముగ్గురుందురని కబురు తెలిసినది) పారిపోకుండ కావవలయుననియు, పై ముగ్గురును తమతమకార్యములను నిర్వర్తించినతర్వాత బండిలోనివారలను గట్టివైచి రోడ్డుప్రక్క బడవైచి దస్తుండిన ట్రంకుపెట్టెను మోసికొని అంచీల మీద మండపేట సమీపముననున్న స్వస్థానమును జేరవలసినదనియు, నేర్పాటులు గావింపబడెను. బండికి రెండును తెల్ల యెద్దులన్నియు, గూడునకు బైన తారుగుడ్డ యుండుననియు, యెద్దుల మెడలలో గంటలుండుననియు, తెలియజేయబడెను. ఇంకొక పావుగంటలో, ఉండూరువంతెనయొద్ద కంపబడిన కుఱ్ఱవాడరుదెంచి, బండి యొక్క టియే వచ్చుచున్నదనియు, ఇంకొక యరగంటలో నాతావును జేరగల దనియు, జెప్పెను. అందఱును జాగరూకులై యుండిరి.

బండి సంకేతస్థలమును జేరెను. మాటునదాగియున్న సింహా ములవలె ముగ్గురును బండి నాపివైచి తమతమ పనులను గావించిరి. బండిలో ముగ్గురేయుండిరి. వాండ్రనోట గుడ్డలుగ్రుక్కి బండివానితో బాటుగా రోడ్డుప్రక్కను బడవైచిరి. ఆట్రంకుపెట్టెను బట్టుకొని ప్రక్కదారిని మండపేటవైపు పందఱును బర్వెత్తజొచ్చిరి. విశ్వనాథము మాత్రము బండిలోని మనుష్యులను బంధించుటయందు దోడ్పడక మిగిలినవా రాపనిని జేయుచుండగా తానుబండిలోనుండి ట్రంకునులాగి రోడ్డుపై బడవైచెను. మార్గమధ్యమున విశ్వనాథముకూడ కొంతవఱకు పెట్టెను మోయవలసి వచ్చెను. దొంగరాము డాసమయమున వానితోకూడ పర్వెత్తి ఎక్కువనేర్పుతో తనకార్యము నెరవేర్చెనని విశ్వనాథమును స్తుతింపసాగెను. తూర్పింకను తెల్లవారకపూర్వమే వీ రందఱును తమనివాసస్థానమును జేరిరి. మండపేటకు గొంతదూరమున నున్న పిడపర్తిగ్రామమున వీరు నివాసమేర్పఱచుకొనిరి. వీరు మాల

గూడెమున నొక తాటాకుల గుడిసెయందు వసించుచుండిరి. తమబరువునదించి లోపలిగదియందుంచి తాళమువైచి యందఱును ముందు గదిలో పఱచియుంచబడిన చాపలపైన బరుండిరి. ఏదేదియో యిష్టాగోష్ఠిని మాట్లాడుకొనుచు వారందఱును లోకమంతయు మేల్కొను సరికి నిద్రబోయిరి.

## 7

మధ్యాహ్నము 2 గంటలకు క్రమక్రమముగా వారందఱును నిద్రలేచి, స్నానముజేసినవారు స్నానముజేయగా భోజనములజేసి గుడిసెలో కూర్చుండి యుండిరి. ఆగుడిసె నించుక వర్ణింపవలయును.

గుడిసెకు నాల్గువైపుల నెత్తయిన తాటాకుదడు లున్నవి. లోపలి యావరణలో రెండు మామిడిచెట్లును, ఒకయుసిరి వృక్షమును రెండు కొబ్బరిచెట్లును, పదెనిమిది తాటిమొక్కలును, కుంకుడుచెట్టొకటియునున్నవి. గృహమంత గుంభనగా పైకగుపించదు కాని లోపల నతివిశాలముగ నుండెను. గృహమంత రెండుగదులుగా విభజింపబడి యుండెను. ఇంటివెనుక నొకవసారా యుండెను. ఈవసారాయం దందఱును వంటజేసికొనుచుందురు. ఆ గదులలో నొకదానియందు వారెల్లరును తమసామానుల నుంచుకొని రెండువదానియందు శయనింతురు. విశ్వనాధ మాదినము నందఱును భోజనము జేయువఱకును నిద్రలేవక, ఏదియో మిషబెట్టి వేఱుగా వండుకొని భుజించెను.

రాత్రిపడువఱకును వీరెల్లరును తమగుడిసెయందే కూర్చుండి యుండిరి. (ఆకాలమునందే దొంగరాముడు విశ్వనాధమును వెంబడించినగాధ నాతనితో చెప్పెను) అగ్గిరాము డాదినమున తమ్మెల్లరను

జూడవచ్చునని కాబోలును వారెల్లరును నుత్సాహవంతులై యుండిరి అచ్చట జేరియున్న గుంపులో దొంగరాముడును, బలేరామడును, విశ్వనాధమును గాక ఇంకొకయేడుగురు మనుష్యు లుండిరి. వారిలో కొందఱు విశ్వనాధమును మండపేటసమీపమున జూచినవారును మఱి కొందఱు రామచంద్రపురమునకావల దొంగతన మొనర్చినవారును గలరు. ఇంతలో బలేరాము డికిలించుచు లేచి, వారల కిట్లుపన్యసింప నారంభించెను.

"అన్నలారా! తమ్ములారా! మనమెల్లరము నొకరీతిగా నుద్యోగస్థులమే అనుకొనియెదముగాక! మనయధికారి వచ్చినప్పు డేవిధముగా మనము సంచరింపవలయునో ఆరీతిగనే మనమేలు గోరుచు బీదసాదలకు సమానత్వమును జేకూర్చుటకై యత్నించుచున్న మన నాయకుఁడు మనల చూడవచ్చినప్పు డదేరీతిగా సంచరింపవలయును. అగ్గిరాముఁడగ్గిరాము డనుకొనుటయే కాని నాకును దొంగరామునికిని దప్ప మీకెవ్వరికిని వానిసామర్థ్యాదులు తెలియవు. కొంచెమాతని శక్తిసిగుఱించి చెప్పెదను. అతనియాకారమును జూచినంతనే యాతని దేహదార్ఢ్యము మనకంతగా బోధపడదు. ఆతనినుగుణత జప్పి జూచినచో నాతడు పేరుమోసిన దొంగయా యని మీరు సందియ మందెదరు. కఱ్ఱనుగాని, కత్తినిగాని, పుచ్చుకొని సామునారంభించె నేని నూరుమందినైనను అవలీలగా నడ్డగలడు. ఆకాలమునందాతని రూపము మెఱుపువలె, నెప్పుడైన గనబడునేమో సంశయాస్పదమే! బాహాబాహి పెనగనారంభించెనా యాతనితో బోరి నేటివఱ కెవ్వరును నెగ్గిరని లోకమున జెప్పుకొనుటలేదు. పిస్తోలుతో లక్ష్యము తప్పకుండ నెంతటిసూక్ష్మవస్తువునైనను మానవాసాధ్యమైనంతదూర మునుండి కొట్టగలడు. ఆతనితో నెంతవడిగా వెంబడించువాడైనను

పరుగెత్తలేదు ఆతని దేహమునకు ముండ్లునాటవు. ఆతడు తెలుగు, హిందీ, హిందూస్థానీ భాషలను స్వదేశస్థునివలె, మాటలాడగలడు అరవము, ఇంగ్లీషు, కొంచెముగా మాట్లాడగలడు. ఇక నాతనిమంచితనము నాతడు దోచినవారలే యుగ్గడించుచుందురు. ఆత డెన్నిసారులు దారులుకొట్టినను నేటివఱకు ప్రాణహానిజేసి యెరుగడు. స్త్రీలను, లేబ్రాయపువారల నెన్నడును బెదిరించియైన యెఱుగడు. తాను తప్పించుకొనిపోవుటకు వీలులేనప్పుడు మాత్రము కొంచె మెదటివారలను నొప్పించి తనదారి నేగెడువాడే కాని అప్పుడైనను రక్తమును గంటజూచియెఱుగడు. నేటికి సుమారు పదిపండ్రెండేండ్లనుండి యాతడు దొంగతనములు చేయుచున్నను పోలీసు వారింతవఱకు సలాము చేయుచుండుటయేకాని, వానియెదుటబడి పోరాడినవాడు లేడు. ఇట్టిమహానీయుడు మనకు నాయకుడై యుండ మనకేటికొదవ? ఇట్టి దేశోపకారి మనకు గురువై యుండ మనమేల భీతిల్లవలయును? దొంగ దేశోపకారి యెట్లగునందురా? ఆతడు భాగ్యవంతులనే దోచికొని, బీదవారిని పోషించుచున్నాడు. బీదల కాతడు దైవసమానుడు. సాధారణసంసారుల నాత డెన్నడును బాధించియెరుగడు. అతని యద్భుతచర్యల నింకొకసారి చెప్పెదను. అతని దైవభక్తి, దీనసంరక్షణయే, నాతనిని దీర్ఘాయుష్మంతుని జేసి మన్నింపగలవు."

"ఎవరిని దీర్ఘాయుష్మంతునిజేసి మన్నించుట?" అని యొక గంభీరస్వరము గుడిసె వెలుపలనుండి వినబడెను. బలేరాముడు గంతులువైచుచు తలుపుదీయబోయెను. అగ్గిరాముడు లోపల ప్రవేశించెను. గుడిసెలోనున్న వారంద రున్న—విశ్వనాథముకూడ—ఒక్కపెట్టునలేచి "అగ్గిరామ్‌గురోజీకి జయ్" అని కేకలు వైచిరి. కుశల ప్రశ్నములు తీరినతర్వాత దొంగరాముడు విన్నన్న వృత్తాంతమంతయు

దానితో జెప్పెను. అగ్గిరాముడు విశ్వనాథమును జేరి ఆతని యొద్ద గూర్చుండి వానిముఖమును తీక్ష్ణముగా బరిశీలించి భుజముపై చేయి వైచి నానందముగా.

"విన్నన్నా ! దొంగరాముడు చేసినదానికి నేనెన్నడు సిద్ధు రాను. నీకేవిధమైననుమానము వలదు. యథేచ్ఛగా నుండవచ్చును, అని ధైర్యము జెప్పెను.

"నేను తిండిలేక మీపాదములపైబడి జీవనోపాధి నేర్పఱచు కొనుటకై వచ్చితిని. మిమ్ములను జూచుట నేటికిగానితటస్థించినదికాదు మీకోయి వచ్చిన నాకు మీయనుచరుల స్నేహముముందుగా తటస్థిం చినది. వీరును మీరును నాయందు జూపిన దయకు నేనెంతయు గృత జ్ఞుడను."

"విన్నన్ననుజూచి మేము మొదట నేమోయనుకొంటిమి. కాని మాకు నామముల బెట్టజాలిన సమర్థుడని మొన్నటి నిన్నటి వ్యవహార ములలో తేలినది." అని బలేరాము డికిలించెను.

"విశ్వాసముగా నున్నచో వాని కేవిధమైన హానియు రానేరదు మీవలెనే అతడును నానమ్మినబంటుగా నుండును. నేనిదే అభయ హస్త మిచ్చుచున్నాను." అని అగ్గిరాము డాతనిచేతిలో చేయి వైచెను.

విశ్వనాథము తన సంతోషమును గనబఱచుచు "అగ్గిరాముడు తలచినయెడల లోకేమిరాగలదు! నాకానందమైనది" అనెను.

అగ్గిరాముడు దొంగరాముని నావలకుదీసికొనిపోయి సుమారు నున్నపదిహేనునిమిషములవఱకును మాట్లాడి పిదప గుంపువారందఱ

నున్న తావునుజేరి కూర్చుండెను ఒకగంటవఱకును వారెల్లరు నిష్టాగోష్ఠి మాట్లాడుకొనుచుండిరి. అగ్గిరాముడు తాను పోవలయునని లేచి ముందు జరుపబోవు దొంగతనములను గుఱించి తనవారి కెఱిగింపదలచి యిట్లు పన్యసింపదొడగెను.

"సోదరులారా! నేను చెప్పబోవు సంశయములను జాగరూకులై సావధానముగా వినవలయును. మనవృత్తి కొలదిదినములక్రిందటివలె నేడు నిష్కంటకమై లేదు. పోలీసు మనవృత్తికి భంగము కలిగింప వలెనని విశ్వప్రయత్నము జేరుచున్నారు. వివిధోపాయముల నవలంబించుచున్నారు. మనగుంపు కొంతవఱకు వారల యధీనమైనది. కాని నేటివఱకు మాత్రము నాయకులను వారు పట్టుకొనలేకున్నారు భగవదిచ్ఛ యెట్లుండునో మనము చెప్పలేము. సాధ్యమైనంతవఱకు మనము జాగ్రతగానుండుటయే మనకు తరుణోపాయము. మనము వసించియున్న యీమాలగూడెములోనివారెల్లరును మనకు లోబడి యే యున్నారు. మనవలన కొలదిగనో గొప్పగనో వార లనుభవించుచున్నారు. అందుచే వారు మనమున్న తావున్న పై వారి కెఱిఁగింప నేరరు. వారలట్లు మనకు లోబడి యున్నంత కాలమును, మనము హాయిగా గుండెపై చేయివైచికొని నిద్రింపవచ్చును. కాని రోజు లెట్లుండునో మనము చెప్పనేరము. కారణాంతరములవలన, నేను విడిగా సంచరింపవలసి యున్నది. నేను లేనికాలమున మీరతి జాగరూకులై మెలంగుట శ్రేయస్కరము. మెలగువిధులన్నియు మీరిదివఱ కెఱింగి యే యున్నారు. క్రొత్తగాజేరిన విస్సన్నకు దొంగరాము డావిధుల నెఱింగించును. ఇక జరుప దలచిన దొంగతనములను గుఱించి తెలియ జేయుదును. సావధానముగా వినుడు. రేపురాత్రి మీరెల్ల నవప ర్తి లోనొక భాగ్యవంతుని యింట బ్రవేశించి సొత్తును తీ కొని రావల

యును. ఆవైన మంతయు దొంగరామునితో జెప్పితిని! అతడు మీకు తెలియింప గలడు నేనచ్చటకు రావీలులేదు కావున జాగరూకులై మెలంగవలయును. నేడు తదియగదా! తిరిగి షష్ఠిరోజున ద్వారపూడి రోడ్డున రామచంద్రపురము పెండ్లివారు పోయెదరు. సుమారు 10 గంటలకు బండ్లు వంతెనదిగును. వంతెన దిగినవెంటనే మీపనిమీరు జూచుకొనవలయును. నేనుకూడ బహుశః రావచ్చును. కాని యిన్నిటి కంటెను ముఖ్యమైనది నవమినాటి రాత్రి 12 గంటలకు జరుగవల యున్నది. ఆర్యావట్టములోని క॥ ల॥ ఇంట ప్రవేశించి, సామాను నంతయు తెల్లవారుసరి కిచ్చటకు తీసికొని రావలయును అచ్చటకు నేనును రాగలను ఎల్లుటిరాత్రి నేనొక చిత్రము నాచరించెదను. తరువాత నయ్యది మీకు తెలియింగించెదను. నేను లేనని మాత్రము మీరింత మాత్రము నధైర్యము నొందవలదు.”

పిదప నాతడు దొంగరామునితో పదినిమిషముల వఱకు గున గుసలనాడి “అగ్గిరామ్ గురోజీకి జయ్” అను శబ్దము మధ్య నంధ కారములో నైక్యమైపోయెను.

# 8

గ్గిరాముడు గుంపును విడచి యెచ్చటికో పోయెను అతని యునికి దొంగరామునకు దప్ప మఱెవ్వనికి దెలియదు. విశ్వనాధ మగ్గి రాముని జూచినదిమొదల లాతని రూపమునకును, పిదప వానివాక్యముల కును మితిలేని యాశ్చర్యము నొందెను. అతని రూపమును జూచినవా రెవ్వరు నాతడు దొంగయనియు, విశేషబలశాలియు దలంచుట కవ కాశములేదు. అతని వాక్యములను వినిన నాతడు నీచవృత్తియందు సంచరించువాడని యెవ్వరు ననుకొనరు రాకపోకలయందలి యాతని

తెలివితేటలను, పన్నుగడల యందలి యాతనినేర్పును వశీకరణమునం దాతని చాకచక్యమునుగని విశ్వనాధము తానుకూడ నిజముగ దొంగ యై, యగ్గిరాముని యనుచరునిరీతి నుండిన నెట్లుండునోయని చింతింప నారంభించెను. అట్టియసాధారణ ప్రజ్ఞగలవాడు కనుకనే, నేటివఱకు నాతడు పోలీసుచేత బడకుండెననియు, నాతనియునికి పైవారెఱుంగ లేకుండిరనియు విశ్వనాధమూహించెను. అగ్గిరాముడు నిజముగ చోర చక్రవర్తియను బిరుదము కర్హుడే.

ఇట్లుతలంచుచుండిన విశ్వనాధమును దొంగరాముడు సమీపించి ఏమోయి! జోగుచుంటివా?" అని కండ్లయెదుట జప్పట్లుచరచెను. విశ్వనాధ ములికిపడిలేచి "గురుదర్శనానందము ననుభవించుచుంటిని" అనెను.

విన్నన్నా! నీసంగతి అగ్గిరామునకు పూర్తిగాతృప్తియైనదట! కూపీలు తీయుటయందు నీకు బ్రజ్ఞయుండవచ్చునని నీముఖమునుబట్టి గ్రహించినాడట! కావున నిన్నికముందు దొంగతనములకు ముందు కూపీలను దీయుట కంపవలయునని యాతడు నిర్దేశించినాడు."

"నాకది సంతోషమే; కాని, ఆతడు నన్నేల అంత తీక్ష్ణముగా నుదృష్టిచే పరిశోధించినాడు? ఆతనికి నావిషయమై యనుమానము న్నదా?

"అనుమాన మున్నదనికాదు. పోలీసువారు మనలను బట్టుకొ కై చేయు ప్రయత్నములను జూచి యాతడు పోలీసు వాడెవడైన ... మున వచ్చెనేమోయని పరిశీలించెను. అంతమాత్రము జాగ్రతలేని ...డల, మనకీకాలమున నుప్పునుగంజియు లభించునా?"

"నిజమే. అందుకు నేనేమియు ననుకొనుట లేదులెమ్ము. మన మానవర్తి పయాణ మెప్పుడు ఎంతమంది పోవలయును."

"మనమైదుగుర మేగవలయును. రేపు మధ్యాహ్నము బయలు దేరి, సాయంకాలమున కనపర్తి జేరవలయును."

ఇంతలో బలేరాముడు వారున్న తావునకు జేరి, "విన్నన్నా; నా చేతికి తగినపని యీమధ్యదగులలేదు. పంజాపట్టెదవా ?" అనెను.

"నాకిదివఱ కలవాటు లేదు కాని; నీకంత యవసరమైన బట్టె దను." అని విశ్వనాధ మాతనితో పంజాపట్టుట నారంభించెను. ఆదిని గొంచెమాతడు బలేరామునకు లొంగునట్లు గనిపించెను కాని, పదినిమి షములైన తర్వాత, నాతడు బలేరాముని ముప్పుతిప్పలుపెట్టి యింకె న్నడు దనతో పట్టనని యనిపించెను. చుట్టునున్నవారు గొల్లున నవ్విరి దొంగరాము డాతని వీపుపై జఱచి, "వాడికి శాస్తిజేసినావు ఇక ముందు మమ్ము బలేరాముడు పంజాబట్టుమనినప్పుడెల్ల నిన్ను జూపింతుము. ఇకనీపేరు 'వానికి బ్రహ్మాస్త్రమే!" అని మెచ్చుకొనెను.

ఇట్లువారు కొంతకాలము వఱకును గాలక్షేపముజేసి, భోజనా ద్యవశిష్టములను దీర్చికొని సుఖనిద్రాపరవశులైరి.

మరునా డుదయము మొదలు మధ్యాహ్నము రెండుగంటల వఱకును, నాగుడిసె నాటకరంగస్థలమాయెను. ఆకాలమున నాగుడిసె నుండి, గంటగంట కొక్కడుగా, నొకపంచాంగపు బ్రాహ్మణుడును, నొక కంచుచెంబుల వర్తకుడును, నొకసాతానియు, నిద్దరు రైతులును బయలుదేరి ద్వారపూడిదారి నొకరొక్కరే అనవర్తిజేర నారంభించిరి వేషముల దాల్చుటయందును! తదనుసరణముగా బ్రవర్తించుట యందును వీరాఱితేరినవారని యీనాటిచర్యయే బాగుగా చాటగలదు. విశ్వనాధము సాతానివేషము దాల్చెను: దొంగరాముడు పంచాంగపు బ్రాహ్మణుడాయెను. బలేరాముడు కంచుచెంబుల వర్తకుడయ్యెను. మిగిలిన యిద్దరును రైతులవలె బ్రచ్ఛన్నవేషములను దాల్చిరి.

విశ్వనాథము చేతిలోని 'విసిని' కర్రయందు కన్నపుగత్తి యమర్పబడి యుండెను. మిగిలిన నలుగురి చేతులయందలి కర్రలయందును గత్తుల మర్పబడియుండెను. ఇట్లు వీరొకరి వెంబడి నొకరు ద్వారపూడి సమీపములను జేరి సాయంకాలమగుసరికి కూరియందు బ్రవేశింపవలయును. దొంగరాము డాగృహస్థునింట రాత్రికి భోజనమునకు జేరి, వీధి యరుగుపై సాయంకాలము భోజనమునకు బూర్వము గూర్చుండియుండును. మిగిలిన నలుగురు నిల్లునానవాలు జూచికొని రాత్రికి వీధియరుగుపై బరుండియుండు దొంగరాముని జేరి యాతని యనుమతి చొప్పున నింటికిచ్చుటనో గన్నము త్రవ్వవలయును. తెల్లవారులోపున నందఱును దిరిగి పిడపర్తి జేరవలయును.

ఇట్లు ద్వారపూడినుండి పోవుచుండగా విశ్వనాథము సత్రపు సమీపమును జేరిన వెంటనే తనసహజమైన కంఠస్వరముతో భాగవతమునందలి "అలవైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు లోపల" అని పాడునప్పటికి వీధియరుగుపైకి నారాయణదాసా ప్రక్కగదినుండి యరుదెంచెను. ఆతని జూచి విశ్వనాథము తనమార్గమునుండి మరలక నడచుచునే "యెల్లుటిరాత్రి నీగదియందు చీటీపడవేయుదును. ఆప్రకారము తత్క్షణమే యేర్పాటులు చేయించవలయునని సుబ్బారావుతో చెప్పు" అని యాతనికి వినిపించునట్లు చెప్పి తనదారినేగి యొక విజనప్రదేశమున గూర్చుండి యొకజాబునువ్రాసి కట్టుకొనినబట్ట లోదాచి యుంచుకొనెను. ఆగి నారాయణదాసుతో మాట్లాడినచో, నెవ్వరైన గనుగొనినచో, తనప్రయత్నమునకే కాక ప్రాణమునకు గూడ భంగమువచ్చునని యాతడట్లు నడచుచునే దాసుతో మాట్లాడెను.

దొంగరాము డాగృహస్థుని యింటికి సాయంకాల మైదు గంటలకుజేరి రాత్రికి భోజనము బెట్టింపవలయునని వేడికొనెను.

